ప్రథమ ముద్రణ : 1995 - 2500
ద్వితీయ ముద్రణ : 1998 - 3000
తృతీయ ముద్రణ : 1998 - 6000
చతుర్ధ ముద్రణ : 1998 - 2000

## రచయిత యితర గ్రంధములు :

1. శ్రీ షిరిడీ సాయిబాబా జీవిత చరిత్ర 168 పేజిలు రూ. 15/-
2. The Life Sketch of SRI SHIRIDI SAI BABA (Pearls from Deep)
   Price :Rs 8/-
3. శ్రీ సాయి సత్యవ్రత కథలు (అముద్రితము)



మూల్యం : నిష్ఠ - సబూరి

దాత : బాబా పాద పద్మములకు నమస్కరించి దాస భక్తుని సమర్పణ

ప్రాప్తి స్థానము : శ్రీ షిరిడీ సాయి భక్తసేవా సమాజ్
గుంటూరు జిల్లా
కార్యాలయము,సాయిబాబా మందిరము,
సాయినగర్, పొన్నూరు - 522 124.

ముద్రణ

# శ్రీ షిరిడీ సాయి బాబా జీవిత సంగ్రహము

బాలబాలికల ఉపయోగార్థము

(పెద్దలు కూడా నిత్యము పఠించతగిన పుస్తకము)



## అంకితము

సమర్థ సద్గురువు - మద్గురువు

శ్రీ సాయిబాబా పాద కమలములకు

నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
తాపసమందార! నాకు దయ సేయగదే!

సాయిసేవలో

ఆలూరు గోపాలరావు

రచయిత

ప్రథమ ముద్రణ : 1995 - 2500
ద్వితీయ ముద్రణ : 1998 - 3000
తృతీయ ముద్రణ : 1998 - 6000
చతుర్థ ముద్రణ : 1998 - 2000

## రచయిత యితర గ్రంథములు :

1. శ్రీ షిరిడీ సాయిబాబా జీవిత చరిత్ర 168 పేజిలు రూ. 15/-
2. The Life Sketch of SRI SHIRIDI SAI BABA (Pearls from Deep)
   Price :Rs 8/-
3. శ్రీ సాయి సత్యవ్రత కథలు (అముద్రితము)

మూల్యం : నిష్ఠ - సబూరి



దాత : బాబా పాద పద్మములకు నమస్కరించి దాస భక్తుని సమర్పణ

ప్రాప్తి స్థానము : **శ్రీ షిరిడీ సాయి భక్తసేవా సమాజ్**
**గుంటూరు జిల్లా**
**కార్యాలయము,సాయిబాబా మందిరము,**
**సాయినగర్, పొన్నూరు - 522 124.**

---

ముద్రణ
సృజన ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
గార్లపాటి కోటేశ్వరరావు కాంప్లెక్స్, పొన్నూరు - 522 124.

# శ్రీ షిరిడీ సాయి బాబా జీవిత సంగ్రహము



బాలబాలికల ఉపయోగార్థము
(పెద్దలు కూడా నిత్యము పఠించతగిన పుస్తకము)

## అంకితము

### సమర్థ సద్గురువు - మద్గురువు
### శ్రీ సాయిబాబా పాద కమలములకు

**నీ పాదకమల సేవయు**
**నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాం**
**తాపార భూతదయయును**
**తాపసమందార! నాకు దయ సేయగదే!**

సాయి సేవలో

**ఆలూరు గోపాలరావు**
రచయిత

Ref. [illegible] 301/[illegible]/2002/594 [illegible] 28.9.02
[illegible]

# మనలోమాట

బాల్యదశ నుండియే బాల బాలికలలో నైతికమైన విలువలతో పాటు దైవభక్తిని గూడ కలిగించవలెనను సదుద్దేశముతో ఇంతకు మునుపు నేను రచించిన శ్రీ సాయిబాబా చరిత్రలోని ముఖ్యమైన 108 అంశములను ఎన్నుకొని యీ చిఱుపొత్తము రచించబడినది.

సాయి తత్త్వములోని విశిష్టతను సంగ్రహముగా నైనను విద్యార్థినీ విద్యార్థులు తెలుసుకొనుటకై దేశమందలి సాయి సంస్థలన్నియు పోటీ పరీక్షలు నిర్వహించిన నా కృషి సఫలము కాగలదని తలంతును.

యీ పుస్తకము పెద్దలకుకూడ సాయినాధుని గురించి అవగాహన పెంచుకొనుటకు ఎంత యో ఉపయోగపడగలదు. నిత్యము పఠించదగిన పుస్తకము.

నేను వ్రాసిన యీ చిన్న పుస్తకము యొక్క వ్రాతప్రతిని శాతవాహన చరిత్ర కృతిపతులు, భాషాప్రవీణ శ్రీ జొన్నలగడ్డ జానకిరామయ్య *(రిటైర్డు సీనియర్ తెలుగు పండిట్, పొన్నూరు)* గారు పరిశీలించి పరిష్కరించుటయే కాక, ముద్రణ జరుగుచున్న సమయములో దోషములేమియు దొరలనీయక ప్రూఫు రీడరుగా కూడా పనిచేసి యున్నారు. వారు చేసిన మేలు మరువరానిది. వారికి ఇవే నాకృతజ్ఞతా పూర్వకనమస్సులు.

పొన్నూరులో సాయి సంస్థ వ్యవస్థాపకులు శ్రీ వి. మహేంద్రనాథ్‌గారు *(రిటైర్డు తహశీలుదార్)* వ్రాతప్రతిని చదివి, ఈ గ్రంథ రచనలో మీ కృషి అమోఘము, బాబాను గురించి తెలుసుకొన వలసినదంతయు ఇందులోనే ఉన్నది అని చెప్పిరి. వీరికి నా కృతజ్ఞతలు.

ఇట్లు

**ఆలూరు గోపాలరావు**


***రచయిత చిరునామా :***

***ఆలూరు గోపాలరావు***

పంచాయితీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు (రిటైర్డు)

భావనగర్ కాలనీ, పొన్నూరు - 522 124

గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

# శ్రీ షిరిడీ సాయిబాబా జీవిత సంగ్రహము

శ్రీ గణేశాయ నమః    శ్రీ సరస్వత్యైనమః    శ్రీ సాయినాథాయ నమః

1. షరిడీ మహారాష్ట్రలోని అహమద్‌నగర్ జిల్లా కోపరుగాం తాలుకాలోనున్నది.

2. బాబా వచ్చిన మొదటి దినములలో షిరిడీ మట్టితో నిర్మించిన 80 పూరి ఇండ్లుగల చిన్న గ్రామము. నేడు గొప్ప గొప్ప భవనములతో గొప్ప పట్టణముగా మార్పు చెందినది.

3. హైదరాబాదు నుండి రైలులో మన్మాడు వరకు వెళ్ళి యచట నుండి షిరిడీకి బస్సులో వెళ్ళవలెను. లేదా నేరుగా హైదరాబాదు నుండియే బస్సులో షిరిడీ చేరవచ్చును.

4. 1854వ సంవత్సరములో 16 సంవత్సరముల వయస్సులో మొదటి సారిగా బాబా షిరిడీ వచ్చినారు.

5. బాబా షిరిడీ గ్రామమునకు ఉత్తరదిశలో నున్న వేపచెట్టు క్రింద కూర్చునేవారు. మూడు సంవత్సరముల తరువాత ఎవరికి చెప్పక షిరిడీ నుండి ఎచటికో వెళ్ళిరి.

6. 1858లో ఔరంగాబాద్ జిల్లా **ధూప్** గ్రామము దగ్గరలో నున్న ఒక మామిడి చెట్టుక్రింద చాంద్ పాటీలు అనునతనికి ఒక ఫకీరుగా బాబా కనుపించిరి.

7. చాంద్‌పాటీలు కోరికపై అతని బావమరిది కొడుకు పెండ్లి వేడుకకు, ఆ పెండ్లి బండ్లలో బాబా రెండవసారి షిరిడీ వచ్చిరి.

8. ఖండోబా మందిరము ముందు ఆగిన ఆ బండ్ల నుండి దిగినప్పుడు, ఏ పేరు లేని ఈ బాలుని **దయచేయుము సాయి** అని ఖండోబా మందిర పూజారి భక్త మహాల్సాపతి ఆహ్వానించిరి.

9. భక్త మహల్సాపతి **సాయి** అని పిలిచినప్పటి నుండి వారిని సాయి బాబా అని భక్తులు పిలుచుచుండిరి. షిరిడీలోనే యున్నందున షరిడీసాయి బాబాగా పిలువబడినారు.

10. రెండవసారి 1858లో షిరిడీ వచ్చునప్పటికి బాబా వయస్సు 20 సంవత్సరములని గుర్తించిరి. కనుక వారి పుట్టుక 1838 అయియుండవచ్చు.

11. 1918లో బాబా దేహత్యాగము (చనిపోవుట) చేసినప్పటి వారి వయస్సు 80 సంవత్సరములు (1838-1918). కాని బాబా తన వయస్సు లక్షల సంవత్సరములని చెప్పినందున వారి వయస్సు ఎవరు నిర్ణయించగలరు?

12. షిరిడీ గ్రామములో వారు నివసించినది 60సంవత్సరములు (అనగా 1858 నుండి 1918 వరకు)

13. బాబా యొక్క తల్లి దండ్రులను గుఱించి గాని, బాబా పుట్టుకను గుఱించి గాని తెలియదు. బాబా కూడా ఎవరికి చెప్పియుండలేదు. వారు స్వయంభువులని అనుకోవాలి.

14. బాబాకు వివాహము లేదు బ్రహ్మచారి కనుక వారికి పిల్లలు, కుటుంబము లేదు. సాయి కారణజన్ములు.

15. బాబాది ఏ కులమో, ఏ మతమో ఎవరికిని తెలియదు. మానవులంతా ఒక్కటే అనునదియే వారి మతముకదా!

16. బాబా షిరిడీలో పాడుపడిన మసీదులో నివసించిరి. ఈ మసీదును ద్వారకామాయి అని పిలిచెడివారు.

17. బాబా ఈ మసీదులో ఎల్లప్పుడు వెలుగు **ధుని** ని (అగ్నిని) ఏర్పరచిరి. ఇప్పటికి ఆ ధుని వెలుగుచునే యున్నది.

18. బాబా 1890 వఱకు కాలికి గజ్జెలు కట్టి తకియా (రచ్చ) అనుచోట ఇతర సాధువులతో కలసి పాటలు పాడుచు నాట్యము చేసేవారు.

19. సాయి లంగోటి కట్టుకొని, పొడవైన చొక్కా తొడిగికొని, నెత్తిపై గుడ్డను జడవలె ఎడమ చెవిపై నుండి వెనుకకు వ్రేలాడునట్లు వేసుకొనేవారు.

20. మొదటలో కాశీరాం అనే దర్జీ కుట్టి ఇచ్చిన ఆకుపచ్చ జుబ్బా, టోపి తప్ప బాబా ఎల్లప్పుడు తెల్లని వస్త్రములే ధరించినారు.

21. సాయిబాబా అందముగా, బంగారు రంగులో నుండేవారు. వారి కళ్ళు చీకటిలో మెరిసేవి. నవ్వుమధురంగా నుండేది. ఆజాను బాహువు, 5 1/2 అడుగుల ఎత్తు ఉండేవారు.

22. బాబా మసీదులో ఈశాన్య దిశయందు గోనెపట్టాపై కూర్చొనేవారు. పగలు నిదురపోయేవారు కాదు. సోమరిగా నుండుటకు ఇష్టపడరు. మితభాషి. అడిగినప్పుడు మాత్రమే సమాధానము చెప్పేవారు.

23. పిల్లలతో వినోదముగా మాట్లాడేవారు. ఎత్తుకొని ముద్దు చేసేవారు. పిల్లలను కొట్టనిచ్చేవారు కాదు.

24. బాబా దగ్గర ఉన్న వస్తువులు: ***1) చిలుము గొట్టము, 2) పొగాకు, 3) తంబిరేకులు డొక్కు (రేకుడబ్బా), 4) పాడవుచొక్కా , 5) తలగుడ్డ, 6) సటకా*** మాత్రమే.

25. బాబా ఎల్లప్పుడూ **అల్లా అచ్ఛాకరేగా** (అనగా భగవంతుడు మేలు చేస్తాడు) అని పలికేవారు.

26. బాబా షిరిడీ వచ్చిన మొదటలో మూడు సంవత్సరములు బంతిగన్నేరు, నిత్య మల్లె మొక్కలు పెట్టి వాటికి వామన్ తాత్యా యిచ్చిన పచ్చికుండలతో స్వయముగా బావి నుండి నీరు తోడి పోసి పెంచినారు.

27. బాబా షిరిడీ వచ్చిన మొదటి రోజులలో బాయజాబాయి అనే భక్తురాలు రొట్టె-కూర చేసి గంపలో నెత్తిన పెట్టుకొని బాబాను వెదకి తినిపించేది.

28. బాబా తాను జీవించినన్నాళ్ళు ఐదు ఇండ్లలో భిక్షచేసి, ఆ భిక్షాన్నమునే భుజించినారు. మొదటిగా **అమీన్‌భాయి** అనే ముస్లిమ్ భక్తుడు బాబాకు భిక్ష పెట్టినాడు.

29. మధ్యాహ్నము గం.12-00లకు ఒక చేతిలో తంబిరేకుల డొక్కు, రెండవచేతిలో గుడ్డజోలె పట్టుకుని బాబా భిక్షకు వెళ్ళేవారు. భిక్షకుని వలె **అక్కా! రొట్టెముక్క పెట్టు** అని దానిని అందుకొనుటకు చేయిచాచేవారు.

30. బాబా ప్రతి దినము ***1) సఖారాం షిల్కే, 2) నందు మార్వాడి, 3)***

***గణపతిరావు కోతేపాటీలు, 4)బయాజీమామి, 5)వామన్ గోండ్కర్.*** అను వారి ఐదు ఇండ్లలో భిక్ష చేసేవారు.

31. బాబా భిక్షలో వచ్చిన పదార్థము లన్నింటిని ఒక మట్టి పాత్రలో పోసి కలిపేవారు. కుక్కలు, పిల్లులు, కాకులు తినుచున్నను వాటిని తోలక వాటితో కలసి బాబా కూడా తినేవారు.

32. బాబా బీదలకు స్వయముగా వండి పెట్టేవారు. ఆ పదార్థములు ఉడుకు నప్పుడు ఆ పాత్రలలో తన చేయి తెడ్డువలె పెట్టి యుడికినది లేనిది చూచేవారు. కాని వారి చేయి కాలేది కాదు.

33. 1908 నుండి ఉదయం గం.5-15లకు, మధ్యాహ్నము గం.12లకు సాయంత్రము గం.6-15 లకు, రాత్రి గం. 10 లకు బాబా వద్ద హారతులు ఇచ్చేవారు. ఇప్పుడు ఈ హారతులన్ని సమాధి మందిరములో ఇచ్చుచున్నారు. హారతులలో పాల్గొనుటకు భక్తులు యిష్టపడతారు.

34. మధ్యాహ్న హారతి అయిన తరువాత బాబా మసీదు బయటకు వచ్చి రోడ్డు ప్రక్క గోడకు అనుకొని భక్తులకు ఊది నోసటన పెట్టి చేతులలో పోసేవారు.

35. **అన్నా! మధ్యాహ్న భోజనమునకు పొమ్ము, బాబా బసకు పో, బాపూ! భోజనము చేయుము** అని ప్రతిభక్తునిఆప్యాయంతతో పలుకరించేవారు.

36. భక్తుల వద్ద బాబా దక్షిణగా ధనము తీసికొనేవారు. ఆ సాయంత్రమే ఆ ధనమంతయు బీదలకు పంచేవారు.

37. సాయి తత్త్వములో మొదటిది సర్వమత సమైక్యత. అన్ని మతముల వారిని కలసి మెలసి జీవించుమని బాబా చెప్పేవారు మసీదులో సహపంక్తి భోజనము పెట్టేవారు.

38. మసీదులో శ్రీరామనవమి రోజున హిందువుల పండుగైన శ్రీరామనవమి, మహమ్మదీయుల చందనోత్సవము ఒకే రోజున జరిపేవారు. రెండు మతములవారు ఇందులో కలసి మెలసి పాల్గొనేవారు.

39. మతములను మార్చుకొనుటకు బాబా ఇష్టపడలేదు. మతము మార్చుకొన్న ఒక భక్తుని**నీ అబ్బను (తండ్రిని) మార్చుకొంటావా** అని బాబా మందలించారు.

40. సాయి తత్త్వములో రెండవది రోగులకు సేవ చేయుట. కుష్టురోగియైన బాగోజీకి సేవ చేసిరి.తాను చేయుచూ, భక్తులను కూడా సేవ చేయుమని చెప్పిరి. సేవయే సాయి భక్తుల కర్తవ్యము.

41. బాబా మొదటి దినములలో రోగులకు మందులిచ్చి తగ్గించిరి. తరువాత ధునిలోని **ఊది** ఇచ్చి నయము చేసిరి. వారు ఆశీర్వదించుటతోనే అన్ని రోగములు తగ్గెడివి.

42. ఇప్పడు కూడా సాయిబాబా భక్తులు విశ్వాసముతో షిరిడీ **ధుని** లోని విభూతి నొసటన పెట్టుకొని, నోటిలో వేసుకొనుట వలన అన్ని వ్యాధులు తగ్గుచున్నవి. **ధుని** ఊది ద్వారా శాశ్వత వైద్యమును అందించిరి.

43. సాయి తత్త్వములో మూడవది బీదల సేవ. బీదలకు, అనాధలకు అన్నదానము చేసేవారు. తిండిలేని వారికి అన్నము , గుడ్డలు లేని వారికి వస్త్రములు యిచ్చేవారనినచో బాబాకు మిక్కిలి ప్రీతి.

44. మానవ సేవయే మాధవ సేవ యని భక్తులకు తెలుపుటకై తాను మానవ సేవచేసి, తన భక్తులచే ఇప్పుడును చేయించుచున్నారు.

45. సాయి తత్త్వములో నాల్గవది సర్వజీవ, జంతు, పశు, పక్ష్యాదుల యందు దయ గలిగి యుండుట (దీనినే భూతదయ యందురు).

46. ఆకలిగొన్న ఒక కుక్కకు ఆహారముగా రొట్టెపెట్టినప్పుడు అది తన ఆకలి తీరినట్లేనని బాబా లక్ష్మీబాయి షిండేతో, ఆత్మారాముని భార్యతో చెప్పిరి. సర్వజీవులలో తనను దర్శించమని చెప్పిరి.

47. శ్యామకర్ణ అనే గుఱ్ఱమును కొట్టిన దెబ్బలు తన శరీరము మీద చూపి, ప్రాణముగల ఏ జీవిని హింసించినను తనను హింసించినట్లేనని, కనుక ఏ జీవిని హింసించవలదని చెప్పిరి.

48. బాబా తత్త్వములో ఐదవది దుష్టులను సహితము ద్వేషించక సన్మార్గులను చేయుట. ఎందఱో దుష్టత్వము గలవారు సాయి అనుగ్రహము వలన సన్మార్గులగు చున్నారు.

49. ఎవరిని నిందించరాదనియు బోధించిరి. ఒక భక్తుడు మఱియొక భక్తుని, అతడు లేనప్పుడు హీనముగా తిట్టినాడు. బాబా ఆ తిట్టిన భక్తునకు ఒక పందిని చూపి **ఆ పంది కసువు ఎంత రుచిగా తినుచున్నదో, నీ సోదరునే నీవు తిట్టుట, నీ స్వభావమట్టిది.** అని మందలించిరి.

50. అహంకారము, కోపము, ద్వేషము, ఈర్ష్య మున్నగునవి మానుకొనుమని బాబా చెప్పిరి. కనుక బాల బాలికలు అందఱు తగవులాడుకొనక పై దుర్గుణములను విడిచిపెట్టి కలసి మెలసి యుండవలెను.

51. ఎవరు కాని, ఎట్టి జంతువు కాని, నీ వద్దకు వచ్చినచో తరిమివేయవద్దు. దాహము గొన్న వారికి నీరు, ఆకలి గొన్న వారికి అన్నము, దిగంబరులకు వస్త్రము ఇచ్చిన భగవంతుడు ప్రీతి చెందునని బాబా చెప్పిరి.

52. ఎప్పుడును సత్యమునే పలుకుమని బాబా చెప్పిరి. **ఈ మసీదులో కూర్చొని నేనెప్పుడు అసత్యము పలుకను** అని బాబా అనిరి.

53. ఇచ్చిన మాటను తప్పవద్దనియు, **విశ్వాసము-ఓర్పుతో** నున్నచో నేను నీవెంటనే యుంటానని బాబా చెప్పిరి.

54. **నీవు ఏది చేసినా పూర్తిగా చేయుము. లేదా చేయుటకు ఒప్పుకొనకుము** అని సాయిబాబా హితవు చెప్పిరి.

55. వాదించవద్దు, ఎక్కువగా మాట్లాడకు. భగవంతుడు పుట్టించిన పద్ధతిలోనే యుండుటకు ప్రయత్నించుము. అనియు బాబా చెప్పినారు.

56. **భగవంతుడు ఇచ్చేది పోదు. మానవుడిచ్చేది నిలువదు. సద్గ్రంధాలు చదువుము. దేవుని నామముచ్చరించుము.** అని అన్నారు.

57. **రుచులను కోరవద్దు, పనిచేయుము. పోటీలు కీచులాటలు మానినయెడల భగవంతుడు కాపాడును.** అని బాబా పలికిరి. శ్యామాచేవిష్ణు సహస్రనామము, మరి కొందఱిచే భాగవతము చదివించిరి.

58. బాంద్రానివాసి బాబా తెండూల్కర్ అనే వైద్య విద్యార్థి పరీక్షలో కృతార్థుడు కాలేడని జ్యోతిషులు చెప్పినను బాబా ఆశీస్సులతో అతడు వైద్యపరీక్షలో కృతార్థుడైనాడు.

59. **షేవడే** అనే విద్యార్థి సరిగా చదవలేదని, పరీక్షలో కృతార్థుడుకాలేడని తోటి మిత్రులైన సపత్నేకరు మొదలగువారు అనగా, నాకు బాబా కృపయున్నదని, కృతార్థుడనగుదునని, షేవడే చెప్పెను. అతడు చెప్పినట్లే బాబాపై విశ్వాసముతో చదివి పరీక్షలో కృతార్థుడైనాడు.

60. బాబా దేహత్యాగము తరువాత వేదవ్యాస్ అనే బాబా భక్తుడు ఐ.ఎ.యస్. పరీక్ష ప్యాసయి ఉద్యోగము లభించు వఱకు బాబా అనుగ్రహమును పొందిరి. వీరు ఇప్పుడు హైదరాబాదులోనున్నారు.

61. ఇప్పుడు కూడా ఎందరో విద్యార్థులు సాయిబాబా చెప్పిన పద్ధతుల నాచరించుచు, చరిత్ర పారాయణ చేయుచూ పరీక్షలలో కృతార్థులగుట జరుగుచున్నది.

62. అన్ని దేవతా స్వరూపములు నేనేనని తెలుపుచూ, బాబా భక్తుల కోరికల ప్రకారము ఆయాదేవతా రూపములలో దర్శనమిచ్చుచున్నారు.

63. భక్తుల కోరికననుసరించి ***రాముడుగా, మారుతిగా, విఘ్నేశ్వరుడుగా, పండరీనాధుడుగా, దత్తాత్రేయుడు*** గా దర్శనమిచ్చిరి. భక్తులకు వారి సద్గురు రూపములుగా కూడ దర్శనమిచ్చిరి.

64. ఎంత దూరములో నున్నను భక్తులు ఆపదలో నుండి అర్తితో **సాయి** అని పిలిచిన వెంటనే బాబా షిరిడీలోనే యుండి ఆ భక్తులకు దర్శనమిచ్చి కాపాడుచున్నారు.

65. సముద్ర మధ్యలో నౌక మునిగిపావునప్పుడు అ నౌకాధికారి **సాయి** అని మనస్పూర్తిగా పిలిచిన వెంటనే బాబా అచ్చట దర్శనమిచ్చి నౌకతో పాటు ఆ నౌకాధికారిని రక్షించిరి.

66. 1908లో గురుపూర్ణిమ (అషాడ పూర్ణిమ) రోజున కృష్ణాజీ నూల్కారను గురు పూజోత్సవము జరుపుకొనుమని బాబా చెప్పిరి. ఇది ఒక్కటే బాబా స్వయముగా జరుపుకొనుమని చెప్పిన ఉత్సవము. మంత్రోపదేశములు చేయుట వారి విధానము కాదు.

67. బాబా సద్గురువుగా భక్తులను అనుగ్రహించి, వారిని సన్మార్గులను చేసి సుఖశాంతులు ప్రసాదించుచున్నారు. ఎవరిని కూడా ప్రత్యేకముగా తన శిష్యుడని పేర్కొనలేదు. ఇప్పుడును వారే సద్గురువుగా అనుగ్రహించు విశిష్టమైన మార్గము వారిది. ఇది స్వానుభవములోని విషయము.

68. బాబాలీలలు అద్భుతములు. 1858లో చాంద్ పాటీలుకు తప్పిపోయిన వాని గుఱ్ఱపుజాడ చెప్పినారు. చాంద్ పాటీలు చూచుచుండగనే బాబా భూమిలో సటకా గుచ్చగా నీరును, ఆ సటకాను నేలపై కొట్టగా నిప్పును వచ్చినవి.

69. షిరిడీలోని వ్యాపారులు నూనె ఈయక నిరాకరించగా నీటితోనే దీపములు వెలిగించిరి. ఎదురుగా నున్న ధునిలో చేయి పెట్టి ఎంతో దూరములో కొలిమిలో పడు భక్తుని బిడ్డను రక్షించిరి. వారిలీలలు అన్నియు పంచ భూతములను శాసించుటతో చూపిరి.

70. దాసగణు అనే భక్తుడు గంగా-యమునలు కలియు ప్రయాగలో స్నానము చేయవలెనని తలచగా బాబా తన కాలి బొటనవ్రేళ్ళ నుండియే గంగా యమునా జలములను ప్రవహింపజేసిరి.

71. గాలి-వానలకు భక్తులు భయపడి బాబావద్దకు వచ్చి మొఱపెట్టుకొనగా బాబా మసీదు బయటకు వచ్చి **ఆగు-ఆగు** అని శాసించగానే మేఘములు చెల్లాచెదరైనవి. వర్షము ఆగినది.

72. ధునిలో మంటలు పెద్దవి కాగా భక్తులు భయపడిరి. అది చూచి బాబా **తగ్గు-తగ్గు** అని సటకాతో దగ్గరనున్న స్తంభము పై కొట్టగానే మంటలు తగ్గినవి.

73. నాలుగు మూరల పొడవు, జానెడు వెడల్పు గల కఱ్ఱబల్లను చినిగిన గుడ్డ పీలికలతో మసీదు దూలమునకు ఎత్తుగా కట్టి దానిపై బాబా పడుకొనేవారు. వారెట్లు దానిపై పరుండినది ఎవరు గ్రహించలేకపోయిరి.

74. జంతువులు మాటాడు బాష కూడా బాబాకు తెలుసు. ఒక బల్లి కిచ కిచ మనుచుండగా, అది తన చెల్లెలు ఔరంగాబాదు నుండి వచ్చుచున్నదని తెలిసి ఆనందించుచున్నదని బాబా చెప్పిరి. బాబా చెప్పినట్లుగానే ఒక గుఱ్ఱపు రౌతు ఔరంగాబాదు నుండి రాగా అతని సంచి నుండి ఒక బల్లి దూకి అక్కయైన బల్లి వద్దకు వచ్చినది.

75. గత జన్మలలో మానవులైనవారు, వారు చేసిన పాపముల వలన పాము-కప్పగా జన్మింపగా, గత జన్మలో రక్షించెదనని బాబా చెప్పిన ప్రకారము ఈ జన్మలో పాము నుండి కప్పను రక్షించిరి.

76. గత జన్మలో ఇద్దరు సోదరులు తనతో వుండి వారు పాప కర్మల వలన మేకలుగా పుట్టిరి. ఆ మేకలు బాబా ముందుగా వెళ్ళుచుండగా బాబా వారిని గుర్తుపట్టి తన ప్రక్కనున్న శ్యామాతో చెప్పిరి.

77. బాబా మాటలను జవదాటరాదు. బాబా అనుమతి లేనిదే ఎవరును మసీదు మెట్లు ఎక్కలేరు. బాబా వెళ్ళుమన్న తరువాత ఎవరును అచటనుండుటకు వీలులేదు.

78. బాబాను భక్తులు కోరికలతో ఆశ్రయిస్తారు. బాబా వారి కోరికలు తీర్చి వారిని మంచివారినిగా చేస్తారు. తరువాత భక్తులు కోరకపోయినను వారి వారి అవసరములను, మేలును బాబాయే నెరవేర్చెదరు.

79. బాబాకు ధౌతియోగము, ఖండ యోగము తెలియును. వాటిని వారాచరించిరి. 72 గంటలు శ్వాస విడచి సమాధి పొంది మఱల ప్రాణము వచ్చి చైతన్యము పొందిరి.

80. బాబా వద్ద ఒక ఇటుకరాయి ఉండెడిది. దానిని బాబా తల క్రింద పెట్టుకొనెడివారు. ఒక రోజు మసీదు శుభ్రము చేయు మాధవ ఫస్లే అను భక్తుని చేతి నుండి ఆ రాయి జారి క్రిందపడి విరిగినది. అప్పుడు బాబా **సమయమాసన్నమైనదని** అనిరి. తరువాత కొద్దిరోజులకే బాబా దేహత్యాగము చేసిరి.

81. 1918వ సంIIము అక్టోబరు 15వ తేది మంగళవారము మధ్యాహ్నము గం.2-30లకు దశమివెళ్ళగా ఏకాదశి గడియలలో మసీదులో తన గద్దెపై కూర్చొని ఉండి ప్రక్కనే యున్న బయ్యాజీ పాటిల్ శరీరముపై ఒఱిగి బాబా తుదిశ్వాసను విడచిరి.

82. బాయిజా బాయిమొదటలో తనకు భోజనము పెట్టి చేసిన సేవకు గుర్తింపుగా ఆమె కుమారుడైన తాత్యా కోతేపాటీలుకు జబ్బు చేసి మరణమునకు సిద్ధముగానుండగా అతనికి బదులుగా బాబాయే దేహత్యాగముచేసి తాత్యాను రక్షించిరి.

83. ***తనకు, నివసించు ఈ మసీదు బాగుగా లేదనియు, బూటీవాడకు నన్ను తీసుకొని వెళ్ళినచో నచట బాగుండునని*** చివరిసారిగా బాబా చెప్పెచూ తుదిశ్వాసను వదిలినారు. వారు చెప్పినట్లుగా వారి భౌతిక దేహమును షిరిడీ వీధులలో ఊరేగించిన పిమ్మట ***బూటీ మందిరములో సమాధి చేసిరి.***

84. రాధాకృష్ణమాయి అనే భక్తురాలి కృషి ప్రేరణలతో షిరిడీలో సాయిబాబా సంస్థానము ఏర్పడినది.

85. బాబా జీవిత చరిత్రను గోవింద రఘునాథ్ పురఫ్ అన్నాసాహెబ్ దభోల్కర్ (హేమాడ్ పంతు) మరాఠి భాషలో ప్రప్రథమముగా బాబా శుభాశీస్సులతో 53 అధ్యాయములుగా వ్రాసిరి.

86. ఆ బాబా జీవిత చరిత్రను అంగ్లములో నాగేష్‌వాసుదేవ్ గునాజి, ఆంధ్రమున శ్రీ ప్రత్తి నారాయణరావుగారు రచించిరి.

87. సాయిబాబా జీవిచ చరిత్రను ఇప్పుడు సాయి భక్తులు నిత్యము చదువుచున్నారు. ఆ విధముగా చదువు (పారాయణచేయు) భక్తుల కష్టములను బాబా తొలగించుచున్నారు. కోర్కెలు తీర్చుచున్నారు.

88. తన చుట్టు భక్తులు కూర్చొని యుండగా బాబా చిన్నచిన్న నీతి కథలను ఆ భక్తులకు చెప్పి బోధ చేసి వారి కష్టములు తొలగించుటకు దారి చూపిరి. ఉపన్యాస విధానములు కాక సత్సంగ విధానమును ఆచరించిరి.

89. షిరిడీలో చూడవలపినవి : **1)ఖండోబా దేవుని మందిరము, 2) మారుతీ ఆలయము, 3)ద్వారకామాయి, 4) చావడి, 5) గురుస్థానము, 6) లేండీతోట, 7) సమాధి మందిరము, 8) లక్ష్మిమందిరము, 9) శివ, శని, విఘ్నేశ్వర ఆలయములు, 10) శ్రీమతి లక్ష్మిబాయి షిండే, శ్రీ భక్తమహాల్సావతి, ఉద్ధవరావుదేశ పాండేగృహములు.**

90. బాబా వాడిన తిరుగలి, స్నానము చేసిన బండ, వంట చేసిన పొయ్యి తులసికోట మొదలగు వస్తువులు ద్వారకామాయిలోనున్నవి. ఇచట భక్తులు ధ్యాన-పారాయణలు చేయచుందురు.

91. చావడిలో బాబా వాడిన కొయ్య కుర్చీ, బాబా దేహత్యగము చేసిన తరువాత వారి దేహమును ఉంచి స్నానము చేయించిన బల్ల, చక్రాల కుర్చీ వెనుక భాగములోని ఒక గదిలో ఉన్నవి. రెండవ గదిలో బాబా ఫోటోలున్నవి. ఈ రెండవ భాగములోనికి స్త్రీలు వెళ్ళరాదు.

92. ది.10-12-1910 నుండి బాబా ఒక రోజు మసీదులోను, ఒకరోజు చావడిలోను పడుకొనేవారు. చావడిలో పడుకొనే రోజున మేళతాళములు, దీవిటీలు, పల్లకి, రథము, భజన నాట్యములతో ఊరేగింపుగా వెళ్ళేవారు.

93. ఇప్పుడు కూడ షిరిడీలో ప్రతి గురువారము రాత్రి చావడి ఉత్సవము వైభవముగా జరుగుచున్నది. షిరిడీ వెళ్ళు భక్తులు హారతులు మఱియు ఈ చావడి ఉత్సవములో పాల్గొనుటకు ఉత్సాహము చూపుదురు.

94. 1912వ సం॥ శ్రావణ పూర్ణిమనాడు గురుస్థానములో వేపచెట్టు క్రింద బాబాచే స్పృశింపడిన బాబా పాదుకలను ప్రతిష్ఠించిరి. శుభములు కలుగునని ఇచట భక్తులు దీపములు పెట్టి, ధూపము (సాంబ్రాణి పొగ) వేయుదురు. ఇది తన గురుస్థానమని బాబా చెప్పిరి.

95. బాబా లేండీ తోటకు ఉదయము, సాయంత్రము వేళ్ళేవారు. అచట 1890లో ఒక గుంటలో **నంద దీపమును** వెలిగించిరి. దీనిని 1936లో ఇటుకరాతితో కట్టిన స్థంభము పైకి మార్చిరి. అది ఇప్పటికి వెలుగుచునేయున్నది. దీనికి ప్రదక్షణలు చేయుదురు.

96. సమాధి మందిరములో తాలిమ్ అనే శిల్పి చెక్కిన బాబా పాలరాతి నిలువెత్తు (కాలుపై కాలు వేసుకొని కూర్చున్న) విగ్రహము 1956లో సమాధి వెనుక ప్రతిష్ఠించబడినది.

97. ఈ బాబా విగ్రహము జీవకళతో తొణికిసలాడుచుండును. బ్రహ్మవర్చస్సుతో వెలుగొందుచుండును. కరుణారసము జాలువారునట్లు మనకు స్ఫురించును.

98. **దామ్యా** అనే భక్తునితో **నాకు మరణము లేదు** అని బాబా చెప్పిరి. కనుకనే బాబా దేహమునువదలినను, విశ్వాసము గల భక్తులకు ఇప్పుడునూ బాబా సశరీర దర్శనమిచ్చుచునే యున్నారు.

99. **నేను దేహత్యాగమును చేసిన తరువాత కూడ ఎక్కడైనను, ఎప్పుడైనను నా గురించి తలచినచో నేను అక్కడే యుండును** అని బాబా చెప్పిరి.

100. బాబా అభయ ప్రధానమిచ్చినట్లే శ్రీ బాపట్ల హనుమంతరావుగారు అను భక్తుని, చినగంజాము వద్ద రైలు పట్టాలపై నుండి ప్రక్కకులాగి రైలు క్రింద పడకుండా రక్షించిరి.

101. 1935 నవంబరు 20వ తేదీన న్యాయవాదియైన శ్రీ వేమూరి వెంకటేశ్వర్లుగారు తెనాలిలో రైల్వేస్టేషనుకు గుఱ్ఱపుబండిలో వెళ్ళుచుండగా, ఆ బండి కాల్వలో పడు సమయమున బాబా వెనుక నుండి పరిగెత్తుకొని కేకలు వేయుచు బండిని ఆపి రక్షించిరి.

102. మాతాజీ కృష్ణప్రియ భర్త శేషగిరిరావు గారికి బాబా మాతాజీ కృష్ణప్రియ రూపమున దర్శనమిచ్చి, కమ్మని **టీ** అందించి, తాను ఏ రూపములోనైన ఇప్పుడును రాగలనను లీల చూపిరి.

103. **సద్గురువులకు సాయి సామ్రాట్ వంటివారని,** సాయి బాబాను సేవించుట భగవంతుని సేవించుటయే నని మెహెర్‌బాబా అన్నారు.

104. పూలమ్మగా ప్రసిద్ధి చెందిన సాయి భక్తురాలు మాతృశ్రీ చుండూరు కామేశ్వరమ్మగారు ***మహావిష్ణువైన సాయిబాబా మనకు అండగా ఉన్నాడు ఇక నీవు మంత్రాలు కాని, తాయెత్తులు కాని, ఎవరిని ఆశ్రయించుటకాని చేయవద్దు*** అని ది.20-7-93న ఈ రచయితతో చెప్పిరి.

105. **నాపై దృష్టిని నిలుపు. నన్ను సంపూర్ణముగా నమ్ము అప్పుడు నేను నీ బాధ్యత వహించుదును.** అని బాబా అభయ ప్రధానమిచ్చిరి.

106. **సాయి-సాయి** అని తలచుచూ, నా ఆకారమునే గుర్తుంచుకొని నా లీలలు మననము చేసినచో నీవు ఎక్కడనున్నా నిన్ను కాపాడుచు ఉంటాను అని బాబా అన్నారు. ఇప్పుడు పాటించుచున్నారు.

107. సాయిబాబా ఇప్పుడును దర్శనమిచ్చుచూ కాపాడుచున్నారు. కనుక పెద్దలేకాదు, బాలబాలికలారా! మీరు కూడ సాయిబాబాను నమ్మినచో మీకును బాబా మేలు చేసి, విద్యాబుద్ధులు కలిగించి మీ అభివృద్ధిని ఎప్పటికప్పుడు చూచుచుందురు.

108. తల్లిదండ్రులను, గురువులను గౌరవించి, తోటివారితో తగవులు పెట్టుకొనక, కలసి మెలసి ఆప్యాయతతో ఉంటూ, శ్రద్ధగా చదువుకొని బుద్ధిమంతులై ప్రతి దినము ఈ పుస్తకమును, ఇందలి ఏకాదశ సూత్రములను చదువుచూ బాబా కృపకు పాత్రులుకండి.

***ఓం సాయి శ్రీ సాయి - జయ జయ సాయి***

**సదానింబవృక్షశ్యా మూలాధి వాసాత్**

**సుధాస్రావిణం తిక్త మప్య ప్రియంతం**

**తరుం కల్ప వృక్షాధికం సాధయంతం**

**నమామీశ్వరం సద్గురుం సాయినాథం ॥**



# హారతి :

స్వామి సాయినాథాయ - షిరిడి క్షేత్రవాసాయ

మామ కాభీష్టదాయ మహిత మంగళమ్ ॥ స్వామి॥

లోకనాథాయ - భక్తలోక సంరక్షకాయ

నాగలోక స్తుత్యాయ - నవ్య మంగళమ్ ॥స్వామి॥

భక్త బృందవందితాయ - బ్రహ్మస్వరూపాయ

ముక్తిమార్గబోధకాయ - పూజ్యమంగళమ్ ॥స్వామి॥

సత్యతత్త్వ బోధకాయ - సాధువేషాయతే

నిత్యమంగళ దాయకాయ - నిత్యమంగళమ్ ॥స్వామి॥

ఈ హారతి గేయమును కంఠస్థము చేసి, సత్సంగ హారతి

సమయ మందు సాయి భక్తులుగానము చేయవలెను.

# ఊదిధారణ

పరమం పవిత్రం బాబావిభూతిం

పరమం విచిత్రమం లీలా విభూతిం

పరమార్థ యిష్టార్థ మోక్షప్రదాతం

బాబా విభూతిం ఇదమాశ్రయామి

సాయిబాబా విభూతిం ఇదమాశ్రయామి.

ఈ శ్లోకమును కంఠస్థము చేసి సత్సంగములో పాల్గొను సమయమున ముమ్మారును, మఱియు ఉదయము, సాయంకాలము ఊదిధారణ చేయునపుడు ఒక్కొక్కసారి పఠించవలెను.

## ఓం శ్రీ సాయిరాం - గురుదేవదత్త

## సాయినాథుని ఏకాదశ సూత్రములు

1. షిరిడీ ప్రవేశమే సర్వదుఃఖ పరిహారము
2. ఆర్తులైన నేమి, నిరుపేదలైన నేమి ద్వారకామాయి ప్రవేశించినంతనే సుఖసంపదలందగలరు
3. ఈ భౌతిక దేహానంతరము సైతము నేనప్రమత్తుడనే
4. నాభక్తుల రక్షణము నా సమాధి నుండియే వెలువడును.
5. సమాధినుండియే నేను సర్వ కార్యములు నిర్వహింతును
6. సమాధి నుండి నా మానుష శరీరము మాట్లాడును.
7. నన్నాశ్రయించు వానిని, నన్ను శరణుజొచ్చిన వానిని నిరంతరము రక్షించుటయే నా కర్తవ్యము.
8. నా యందెవరి దృష్టి కలదో, వారి యందు నా కటాక్షము కలదు.
9. మీ భారములు నాపై పడవేయుడు. నేను మోసెదను.
10. నా సహాయముగాని, సలహా గాని కోరిన తక్షణమే ఒసంగెదను.
11. నాభక్తుల గృహముల యందు లేమి యను శబ్దము పొడచూపదు.

# శ్రీషిరిడీ సాయిభక్త సేవాసమాజ్, గుంటూరుజిల్లా.

రి.నెం. 244/98

**కార్యాలయము : సాయిబాబా మందిరం, సాయినగర్, పొన్నూరు.**

గుంటూరు జిల్లాలోని అన్ని సాయిబాబా మందిరముల, సాయిసంస్థల, సాయిభక్తులతో శ్రీ షిరిడీ సాయి భక్తసేవాసమాజ్ గుంటూరు జిల్లా పేర ఒక సంస్థను ది. 24-4-1996 న ఏర్పాటు చేయడమైనది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారు సాయి మందిరములను స్వాధీన పరచుకొనవలెనని తలచినప్పుడు, అందుకు వ్యతిరేకముగా ప్రభుత్వముతో పోరాటము సాగించి కృతకృత్యులు అగుట జరిగినది. చివరకు ముఖ్యమంత్రి గారైన **శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారు** సాయి మందిరములను ప్రభుత్వము స్వాధీన పరచుకొనుట లేదని ప్రకటించిరి.

ఇకముందు జిల్లా సమాజ్ ద్వారా ఈ క్రింది కార్యాక్రమములు ప్రారంభించుటకు నిర్ణయించటమైనది.

1. **జిల్లాలోని అన్ని సాయి మందిరముల, సాయి సంస్థలను సమైక్యత పరచుట.**
2. **సాయి తత్త్వమును మారుమూలగ్రామములకు కూడ ప్రచారము చేయుట.**
3. **సాయి లీలలను కరపత్రముల ద్వారాను, సాయి తత్త్వమును మరియు సాయి పూజా-హారతుల పుస్తకములను ప్రింటుచేయించి పంచుట.**
4. **బాల-బాలికలలో,యువతలో నైతిక విలువలు పెంచుటకు కృషి చేయుట.**
5. **సాయితత్త్వ ప్రచారమునకు సత్సంగములను ఏర్పాటు చేయుట. సామూహిక సాయిచరిత్ర పారాయణను, సాయి సత్య వ్రతములను చేయించుట. సాయికోటి వ్రాయించుట, నామసప్తాహము జరిపించుట మొదలగు కార్యక్రమములు ప్రారంభించుట.**
6. **ప్రతి మందిరము బీదల -అనాథల ఆదుకొనుటకు అన్నదాన-వస్త్రదాన, విద్యా-వైద్యదానము మొదలగు సేవ కార్యక్రమములను ప్రారంభించుట.**
7. **పై కార్యక్రమముల నిర్వహించుటకు ఒక వ్యానును సమకుర్చుకొనుట**

**కనుక అందరు ఈ కార్యక్రమములలో పాల్గొన వలసినదిగాను, వాటి నిర్వహణకు తగు సహాయ సహకారముల అందించవలసినదిగాను కోరుచున్నాము.**

ఇట్లు
శ్రీ షిరిడీ సాయి భక్త సేవా సమాజ్
గుంటూరు జిల్లా